# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras, Regd No. 1118, Vol. 34 No 135 MONDAY 8th SEPTEMBER 1947 వెల ఒక అణా Founder: K. Nageswara Rao

# సరిహద్దు సంఘస్థాపనకు పూర్వమే రాష్ట్రనిర్మాణావకాశం

## "ప్రభుత్వబలప్రయోగంవల్ల శాంతి ఏర్పరచుటకంటే ప్రజలేశాంతి నెలకొల్పుకొనుట సమంజసం"

### కలకత్తా పౌరుల వీడ్కోలుసభలో గాంధిజీ సందేశం

కలకత్తా, సెప్టెంబరు 6: గాంధీ మహాత్ముడు రేపు బయలుదేరి పంజాబు వెళ్ళనున్నాడు. ఆయనకు వీడ్కోలొసంగుటకై ఈ రోజు సాయంకాలం చౌరింగీకి ఎదురుగా నున్న మైదానములో పెద్దసభ జరిగెను.

కలకత్తా తాత్కాలిక మేయరు ఎస్. గోవిందా మహాత్మునుద్దేశించి మాట్లాడుచూ "మీ శాంతి దౌత్యము విజయమందినది. ఇన్నాళ్ళనుండి మీరొక్క గొప్ప దేశభక్తునిగా, బాధిత, పీడిత ప్రజానీకమునకు అభయప్రదాతగా, మోసము, అక్రమములకు ఎదుర్కొను మహత్తర రాజకీయ శక్తిగా మాత్రమే మీ మెరుగుదుము. కాని ఈ నాడు మానవజాతికి ప్రధానసేవకునిగా మిమ్ము గుర్తించుచున్నాము. మీరు జన్మించిన ఈ తరములోనే జన్మించుట మాకు మహాభాగ్యము. ప్రపంచమందంతట అన్ని తరములవారు మిమ్ములను కృతజ్ఞతతో స్మరించుచుంటారు" అని ప్రశంసించెను.

ప్రార్థనానంతర సభలో మహాత్మగాంధి మాట్లాడుతూ, దురదృష్టవశాత్తు, ఈపర్యాయం కలకత్తాలో మతకలహములు చెలరేగినచో, ఆ మరణప్రాయోపవేశం వినా తనకు గత్యంతరం లేదన్నాడు. కలకత్తాలో ప్రశాంతత ఏర్పడినచో ప్రాయోపవేశమును విరమింతునని ప్రతిపర్యాయమూ, చిన్నపిల్లలకు చెప్పినట్లు, చెప్పుచుండుట తనకు ఇష్టంలేదు. అని చెప్పారు. బీహారు, నవఖాలీలలో ఈ కఠోరనియమం వహించి నట్లే, ఇప్పుడు కలకత్తాలో కూడా ఈ నియమం వహించినట్లు గాంధీజీ చెప్పారు. తన జీవితమే అందుకు ఉద్దేశింపబడి వుండుటవలన తనకు గత్యంతరం లేదు. తాను ప్రజలకు ఇంకా కొంతకాలం సేవ చేయాలని భగవదిచ్ఛ అయితే, సక్రమ విధానంలో వ్యవహరించేటట్లు భగవంతుడే వారికి జ్ఞానోదయం కలుగజేస్తాడు. అని గాంధీజీ అన్నారు.

ఈ రోజునవలె ఎల్లప్పుడు కలకత్తా ప్రశాంతముగా వుంటే కలుగగల ఫలితములు గాంధీజీ వివరించి చెప్పారు. కలకత్తా ప్రశాంతంగా వుంటే తూర్పు, పశ్చిమ బెంగాలు రెండూ ప్రశాంతంగా ఉండగలవు. దానితోపాటు బీహారు శాంతియుతముగా ఉండగలదు. దీని ఫలితము పంజాబుకు కూడ జ్ఞానోదయం చేయగలదు భగవంతుడు తనను అక్కడకు బహుశః అందుకే పంపిస్తున్నాడు. పంజాబు ప్రశాంతంగా ఉంటే, తక్కిన భారతదేశమంతా ప్రశాంతంగా ఉన్నట్లేనని గాంధీజీ చెప్పారు.

కలకత్తాలో కల్లోలం ఉపశమించిన మరుసటిదినమే, కలకత్తానుండి, ఇతర ప్రాంతములనుండి వచ్చిన అన్ని వర్గముల స్నేహితుల ఒత్తిడి, భరోసాలవల్ల, తాను ప్రాయోపవేశం విరమించుటవలన, తమ ప్రార్థన మొదలెంచినయినా శాంతిని కాపాడవలసిన బాధ్యత ఆ స్నేహితులపై నున్నదని మహాత్ముడు చెప్పెను. "పరిస్థితి నంతట వారే స్వయముగా చక్కదిద్దుకొనుటకు వ్యవధి లేకుండా, హఠాత్తుగా ప్రాయోపవేశం విరమింపజేయించి, వాగ్దానము చెల్లించుకోలేక నా మరణమునకు కారణభూతులైనారను దోషము వారి నావహించకుండు గాక" అని గాంధీజీ అన్నారు.

హిందూమహాసభాధ్యక్షుడు యన్. సి. ఛటర్జీ, సురవర్దీలవంటి స్నేహితులకోర్కెలను తాను త్రోసిపుచ్చలేక పోతిననియూ, ఇప్పుడు బాధ్యతఅంతా కలకత్తా పౌరులపైనే ఉన్నదనియూ గాంధీజీ చెప్పారు. ప్రభుత్వముచే బలవంతముగా నెలకొల్పబడిన శాంతికన్న, ప్రజలే శాంతి నెలకొల్పుకొనటం సమంజసమని చెప్పుతూ, దురదృష్టవశాత్తూ, కలకత్తాలో కల్లోలం తిరిగి చెలరేగినచో తా మరణప్రాయోపవేశం మొదలించుటకన్న గత్యంతరంలేదని గాంధీజీ హెచ్చరిక చేశారు.

కలకత్తా తాత్కాలిక మేయర్ ఉపన్యాసమును గురించి ముచ్చటిస్తూ "వీడ్కోలు" అన్న పదం తనకు సరిగా వర్తించదన్నారు గాంధీజీ, కలకత్తాలో తన శాశ్వతనివాసమైన

4 వ పేజీ చూడుడు



## రాష్ట్ర రాజకీయమహాసభ విషయనిర్ణయ సంఘసమావేశంలో ప్రసంగాలు

### రైతుకూలీ ప్రజారాజ్యస్థాపనకు పూనుకోవాలని అధ్యక్షుని హెచ్చరిక

### దేశోద్ధారకనగర్‌లో దుగ్గిరాల బలరామకృష్ణయ్యాగారి అధ్యక్షతను 19-వ రాష్ట్రీయ రాజకీయమహాసభ ప్రారంభం

చెన్నపురి, సెప్టెంబరు 7: "ప్రజాసేవకులము మనమెల్లరము 'సర్వేజనా స్సుఖినోభవన్తు' అని ఘోషించు రైతుకూలీ ప్రజారాజ్యస్థాపనకు కటిబద్ధులము కావలసియున్నది. దీనికే కాంగ్రెస్ ఇన్నినాళ్లు తపస్సు చేసినది." అని బౌద్ధవాఙ్మయబ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు 19 వ ఆంధ్రరాష్ట్రీయ రాజకీయమహాసభ అధ్యక్షస్థానమునుండి హెచ్చరించిరి. మహాసభ యస్. ఐ. ఎ. ఎ. ఆవరణలో ప్రత్యేకముగ నిర్మితమైన దేశోద్ధారక నగర్‌లో ఈ సాయంత్రము అయిదుగంటలకు ప్రారంభమైనది.

ఆహ్వానసంఘాధ్యక్షులు యం. కె. వి. రెడ్డిగారు స్వాగతము చెప్పిన తరువాత మద్రాసు రాష్ట్రీ మాజీ ప్రధాని ప్రకాశంపంతులు గారు సభను ప్రారంభించుచు ఆశువుగ ఉపన్యసించిరి. సభకు తెనుగుజిల్లాలు అన్నింటినుండి అసంఖ్యాకముగ ప్రతినిధులు వచ్చిరి.

గత రాత్రి అధ్యక్షుడు, ఆంధ్ర రాష్ట్రీ కాంగ్రెస్ అధ్యక్షుడు, ఇతర ప్రతినిధులు దాదాపు 3 వేల మంది ప్రత్యేక రైలులో పట్నం వచ్చిరి. రాత్రి 9 గంటలనుండి 11 గంటల వరకు ఆంధ్ర రాష్ట్రీ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశము జరిగినది. నేడుదయము విషయనిర్ణయ సభయందు ప్రతిపాదింపబడిన తీర్మానములను ఈ సమావేశమున తయారు చేసిరి.

ఉదయము ప్రభాతభేరీ అయిన తరువాత 'దేశోద్ధారక నాగేశ్వర నగర్'లో అధ్యక్షుడు శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు పతాకారోహణోత్సవం చేసిరి. వెంటనే ఆచార్య రంగాగారి అధ్యక్షతను విషయనిర్ణయ సభ పది గంటలకు ప్రారంభ మయ్యెను. పన్నెండుంబావు వరకూ చర్చించి నాలుగు తీర్మానముల నామోదించిరి.

సభా ప్రారంభకులు ప్రకాశం పంతులుగారు

### విషయనిర్ణయ సభ

ఆంధ్రరాష్ట్రీ రాజకీయసభ విషయనిర్ణయసభ నేడుదయం 10 గంటలకు ఆచార్య రంగాగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. ప్రకాశంపంతులు, సాంబమూర్తి, గద్దె రంగయ్యనాయుడు, తెన్నేటి విశ్వనాథం, శ్రీ కాశీశ్వరరావు, కో. సూర్యనారాయణమూర్తి, కోటిరెడ్డి ప్రభృతులు వేదిక నలంకరించిరి. 90 మంది సభ్యులు హాజరయ్యిరి. ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను.

అధ్యక్షులు రంగాగారు, ఆంధ్ర రాష్ట్రం కొరకు స్వాతంత్ర్యం కొరకు మనమంతా యిదివరకు చేసిన కృషిగూర్చి క్లుప్తంగా చెప్పి, ఆంధ్ర రాష్ట్రం వస్తుందా రాదా అనే సందేహం యిప్పుడు తీరిందనియూ, ఆంధ్రమహాసభ వారు రాష్ట్రీం కాంగ్రెసు సంఘంవారు, పెద్దలందరూ కలసి ఒకే విధంగా ఆలోచించి ఆది ప్రకాశంగారు తయారు చేసిన ప్రణాళికను నిన్నరాత్రి వర్కింగు కమిటీవారు అంగీకరించిరనియూ, దానిని ప్రజాపరిషత్తుసభకే గాక ప్రాంతీయ చేర్పడిన డొమినియన ప్రభుత్వానికికూడ దాన్ని దాఖలుచేయుటకు నిశ్చయించిరి మనిరి. ఇదేగాక మనల నెదుర్కొంటున్న కరువు సమస్యగూర్చి, సంపూర్ణ స్వాతంత్ర్య భానూదయానికి కారకులైన గాంధి మహాత్మునికి జోహారు లర్పించుట మున్నగు తీర్మానాలు యీ సభవారు చర్చించి రాష్ట్రీ కాంగ్రెసు సంఘానికి ఒక ప్రణాళికను తయారుచేయాలని కోరిరి. ఈసభకు బౌద్ధ వాఙ్మయబ్రహ్మ తెలుగు పండితులగు దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు అధ్యక్షులుగ నుండగోరుచు, రేపో ఎల్లుండో అంతా తెలుగులోనే వ్యవహరింపనున్న ప్రత్యేక రాష్ట్రీ శాసనసభ యేర్పడనున్న యీ సమయమున, అధ్యక్షులుగ నుండుట ఎంతయు ఉచితముగ నున్నదనిరి.

శ్రీ బలరామకృష్ణయ్యగారు, పూలమాలాలంకృతులైన తరువాత తమ కృతజ్ఞత తెల్పుచు, తనను అధ్యక్షునిగ ఎన్నుకొనుట సాధారణ స్వాతంత్ర్య యోధుని గౌరవించుటగా నెంచుచున్నారనియు, 62 సం॥ స్వాతంత్ర్య పోరాటమునందు ఆత్మబలిదానం చేసిన యోధులను సంస్మరణచేసి, వారి ఆత్మశాంతి గోరుచు ముందు తీర్మానించాలని చెప్పి, అట్టి దేశభక్తులకు జోహారులు చేయుచు, 2 నిముసాలంతా లేచి నిలువాలని కోరిరి. సభవారట్లు చేసిరి. స్వాతంత్ర్యానికి ప్రాణత్యాగం చేసిన వారందరిపేర్ల జాబితా చదివిరి. వారిలో దండు నారాయణ రాజు గారు (జెయిలులో చనిపోయిన వారు) సుబ్బరాజుగారు మున్నగువారు ప్రముఖులని వారిగూర్చి కష్టంగా సూచించిరి.

1921 సం॥ నుండి దస్తూలయిన జరిమానాలు వాపసు చేయాలని, చనిపోయిన త్యాగుల కుటుంబాలకు గూడ ప్రభుత్వం సహాయం చేయాలని కోరుచు కొందరు సూచించిన సవరణతో గూడ తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది.

అ. సత్యనారాయణ రాజుగారు, అల్లూరి సీతారామరాజుగారి విప్లవంలో తోడ్పడినవారిని కూడ త్యాగులనగా చేర్చాలి, వారు త్యాగులు కారనడం అర్థరహితము.

అధ్యక్షులు—ప్లాసీ యుద్ధంలో చనిపోయినవారు భగతుసింగు మున్నగువారిని గూడ స్మరించుచున్నట్లు తీర్మానంలో గలదని అ. స. రాజుగారు తెలుసుకోవాలనిరి.

అ. స. రాజు:—"శాంతియుతమగు ఉద్యమంలో" అని మాత్రం గలదు.

అధ్యక్షులు:—1921 తరువాతి స్వాతంత్ర్యోద్యమములన్నీ అనడంలో వారూ చేరుదురు.

తరువాత అధ్యక్షులు గాంధిమహాత్మునికి జోహారులర్పించు తీర్మానం ప్రతిపాదించి, భారత భాగ్యవిధాత మానవులకు శాంతిప్రదాతకు జోహారు లర్పించుట మన లను మనం గౌరవించుకొనుట యగుననిరి.

గాంధి ఆరోగ్యంగూర్చిన 3 వ తీర్మానం తరువాత అంగీకరించబడింది.

ప్రకాశంగారు రంగాగారు. ఆంధ్రరాష్ట్రం గూర్చిన తీర్మానాన్ని ప్రతిపాదించిరి. నరసింహదేవర సత్యనారాయణగారు, మరి కొందరును "మదరాసుమాది అని సాంబారుగారు పెద్దగ గోలచేస్తున్నారు. మీరు మద్రాసు చిరిసగం అని రాజీకి దిగుతారా" అని ప్రశ్నించి రావు కమిటీ యేర్పాటుని నిరసించిరి.

ప్రకాశంగారు: ఎవరో ఏదో అన్నారని మనం భయపడరాదు. అందరికి మనం సమాధానం చెప్పలేము. కనుక రాత్రి మేమంతా ఆలోచించి యీ తీర్మానం

(3-వ పేజీ చూడుడు)

రాష్ట్రీకాంగ్రెస్ అధ్యక్షులు ఆచార్య రంగాగారు

### మైసూర్ రైల్వే కార్మికుల సమ్మె

బెంగుళూరు, సెప్టెంబరు 6: ఈ రోజు అర్ధరాత్రి 12 గం॥ నుంచి మైసూర్ రైల్వే కార్మికులు సమ్మె ప్రారంభించారు. బెంగుళూరు రైల్వేస్టేషన్‌లోని రైల్వే ఉద్యోగులు సరిగా రాత్రి 12 గం॥లకు స్టేషన్‌నుండి బైటకు వచ్చివేశారు. ఒక గంటకు సమ్మెప్రారంభమునకనగా, మైసూర్ రైల్వేకార్మికుల యూనియన్ అధ్యక్షుడు హెచ్. డి. రాజ్ మాట్లాడుతూ సమ్మెప్రారంభింపకముందే ప్రభుత్వం లాకౌట్ ప్రారంభించినదనీ కార్మికులు సమ్మెచేయక గత్యంతరంలేదనీ అన్నాడు. స్టేట్ రైల్వేమానేజరు దీనిని ఖండించుచూ ప్రభుత్వం లాకౌట్ చేయలేదనీ, రైల్వే ఆస్తిని స్వాధీనపరచుకొని, కాపాడుకొనవలసినదనీ కార్మికులే సూచించారనీ అన్నాడు. ఈ సమ్మెకు యిచ్చిన నోటీసులోని షరతులు మార్పులు చేసి, మరల నోటీసుయివ్వలేదు కాబట్టి ఈసమ్మెఅశాస్త్రీయమని మైసూరు ప్రభుత్వం ప్రకటించింది.

## పంజాబు శరణాగతుల పునఃస్థాపనకు ప్రత్యేకమంత్రి

### కేంద్రమంత్రివర్గ విస్తరణ:

### కె. సి. నియోగి నియామకం

### గవర్నర్‌జనరల్‌తోకూడినప్రత్యేకఆపన్నివారణసంఘస్థాపన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: పంజాబు పరిస్థితులను ఆలోచించేటందుకు ఈ రోజు సాయంత్రము మంత్రివర్గమువారి ప్రత్యేకసమావేశము జరిగింది.

పంజాబు శరణాగతులబాధ నివారణము కోసమున్నూ వారి పునఃస్థాపనము కోసమున్నూ ప్రత్యేకముగా ఏర్పాటు చేసిన శాఖను నిర్వహించేటందుకు మంత్రివర్గములో చేరవలసిందని కె. సి. నియోగిని ఆహ్వానించినట్లుగా మంత్రివర్గము వారికి ప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ తెలియచేసినాడు

పంజాబు పరిస్థితులను పరిష్కారము చేసేటందుకు మంత్రివర్గమువారు ఆపన్నివారణ సంఘాన్ని (ఎమర్జెన్సీ కమిటీని)నియమించినారు. ఈ ఆపన్నివారణ సంఘములో ప్రధానామాత్యుడు, డిప్యూటీ ప్రధానామాత్యుడు, దేశరక్షణమంత్రి రవాణాశాఖ మంత్రి, శరణార్థుల శాఖామంత్రి సభ్యులుగా ఉంటారు. ఈ సంఘములో చేరవలసిందని గవర్నరు జనరలును ఆహ్వానించినారు. అందుకు అయన అంగీకరించినారు.

ఈ సంఘమువారి సమావేశాలకు సర్వసేనాధిపతి హాజరుఅవుతూ సమావేశ కార్యక్రమములో పాల్గొంటూ సహాయపడుతాడు. పరిస్థితులను పర్యాలోకనము చేస్తూ ఆయావిషయాలలో అవసరమయిన సలహాలను ఇవ్వడానికి ఈ సంఘమువారు ప్రతినిత్యమూ సమావేశము అవుతూ ఉంటారు ఈ సంఘమువారికి ఒక కార్యాలయము పనిచేయడానికి సిబ్బందిని వెంటనే ఏర్పాటు చేస్తారు.

ఈ ఆపన్నివారణ సంఘమువారితో సంప్రదించి సలహాలు పొందేటందుకు వెంటనే ఢిల్లీ వచ్చిపోవలసిందని తూర్పు పంజాబు గవర్నరుకున్నూ ఆ రాష్ట్రీ మంత్రివర్గమునకున్నూ తెలియచేసినారు.

### శ్రీ రామానంద తీర్థ నిరశనవ్రతం

### సంస్థానంలో యూనియన్ దినోత్సవం

('ఆంధ్రపత్రిక' విలేఖరి)

హైదరాబాద్, సెప్టెంబరు 6: సెప్టెంబరు 8 దినమును 'హైదరాబాద్ ఇండియన్ యూనియన్‌లో చేరాలి' అనే ప్రతిజ్ఞా దినముగా పరిగణించాలని హైదరాబాద్ సంస్థాన కాంగ్రెసు కార్యాలయమువారు ప్రకటనచేశారు. నగరములోని విద్యార్థులు, కార్మికులు తమ పనులలోకి వెళ్ళకుండా ఆరోజున ఊరేగింపులు, హర్తాళ్ జరపాలనికూడ విజ్ఞప్తిచేశారు.

ఆ రోజున భారత పతాకను ప్రతిగృహము పైన ఎగురవేయాలనికూడ ప్రకటించారు.

"యీ నెల 1 నుండి సత్యాగ్రహులందరు నిరశనవ్రతము చేయుచున్నారు. వారికి సానుభూతి చూపుతూ 'చంచలగూడ'లోని సెంట్రల్ జైలులో నిర్బంధింపబడివున్న సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడు స్వామి రామానందతీర్థ, డా॥ జి. ఎస్. మెల్కోటే ఇంకా కొంతమంది యీనెల 5 నుండి నిరశనవ్రతము చేయుచున్నారు" అని సంస్థాన కాంగ్రెసు కార్యాలయమువారు ప్రకటించుచున్నారు సెప్టెంబరు 8 న ఊరేగింపులు హర్తాళ్ జరుపవలసిందిగా విజ్ఞప్తిచేశారు. ఆరోజు కార్యక్రమమును విజయవంతంగా చేయుటకు వేలకువేలు ప్రజలు దీక్షవహించాలని కూడ విజ్ఞప్తిచేశారు.

### నా జీవితమే నా సందేశం

కలకత్తా, సెప్టెంబరు 7 నిన్న సాయంత్రం గాంధిజీని దర్శించి శాంతి సేనకు ఒక సందేశం ఇవ్వండని కలకత్తా శాంతి సేనాదళ కార్యదర్శి దేవకోష్ దాస్ గుప్తాగారు అడుగగా మహాత్మాజీ బెంగాలీలో 'అమర్ జీబానీ అమర్ బాణీ' (నా జీవితమే నా సందేశం) అని వ్రాసి ఇచ్చారు

మహాత్ముని ఇతమాత్రం బెంగాలీ పాండిత్యం కల్గించినవారు ఆయన కార్యదర్శి ప్రొఫెసర్ నిర్మలబోస్ అన్న విషయం తెలిసినదే!

### కలకత్తా ముస్లిమ్ లీగు పత్రిక ప్రశంసా వాక్యములు

కలకత్తా, సెప్టెంబరు 6 "నగరమున దరిహింసా కాండ నాప గాంధి మహాత్ముడు గావించిన దుస్సాహసములైన, మహత్తరమైన ప్రయత్నములకు కలకత్తా పౌరులందరు, ముఖ్యముగా ముస్లిములు వారికి జోహారు లర్పించెదరు" అని ముస్లిమ్‌లీగ్ పత్రిక మార్నింగ్ న్యూస్ నేడు సంపాదకీయ వ్యాసములో వ్రాసెను "జీవములలో మేము గాంధిజీతో భేదించి యుంటిమి. బీహారు కలవరపడుచున్న సమయమున నవఖాలీలో ఆయన అవలంబించిన విధానమును మేమెన్నడు అంగీకరించి యుండలేదు ఆయన వైఖరి హిందువుల యెడల అభిమానము చూపునదిగాను మహమ్మదీయుల యెడల సానుభూతిరాహిత్యము చూపునదిగాను ఎంచబడవచ్చునని మేము చెప్పయుంటిమి కాని కలకత్తాలో మాత్రము గాంధీజీ అజరామరమగు మహాత్మ్యశిఖరముల నందుకొనెను హిందువుల యోగక్షేమముల యెడ తన కెంత ప్రమేయము కలదో మహమ్మదీయుల యోగక్షేమముల యెడ గూడ అంత ప్రమేయము కలదని యిచ్చట ఆయన నిరూపించెను, హిందువులు బాధలు కష్టములు తన కెంత ఆవేదన కలిగించెనో మహమ్మదీయుల బాధలు గూడ అంత ఆవేదన కలిగించునని ఆయన నిరూపించెను నగర జనాభాలో నూటికి 23 వంతులుగా నున్న కలకత్తా మహమ్మదీయులు, తమ యోగక్షేమముల యెడల కారుణికులైన ఈ మహాత్మునకు కొన్ని శ్రద్ధకు సర్వదా ఋణపడియుండుదురు మహమ్మదీయులు నగరములో శాంతముగా జీవింపగలుగుటకుగాను ఆయన ప్రాణమర్పింప సిద్ధముగా నుండెను ఇప్పుడు కలకత్తా నగర మహాజనులు మహాత్ముని గౌరవముకు కాపాడవలెను" అని పత్రిక వ్రాయుచున్నది (అ ప్రె)

# కృష్ణాజిల్లాలో లక్ష బస్తాలకు పైగా ధాన్యసేకరణ

## మంత్రి శ్రీ కూర్మయ్యగారి పర్యటన ఫలితం

మదరాసు, సెప్టెంబరు 6: గ్రామోద్ధరణ మంత్రి శ్రీ కూర్మయ్య గారు అగస్టు 24 సెప్టెంబరు 3 తేదీల మధ్య కృష్ణాజిల్లా పంచారముచేసి నేడు మదరాసు వచ్చిరి. కృష్ణాజిల్లాలో 1,05,920 బస్తాలు వారి పంచారమువల్ల సేకరింపగలిగితిమనియు నిడ్రబోలులో 30,000 బస్తాలు అప్పికట్లలో 10 వేలబస్తాలు డిమాండురిజిష్టరు ప్రకారం రావలసి ఉన్నయనియు తెల్పుచున్నారు. ధాన్యసేకరణ విషయములో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము కిసాన్, కాంగ్రెస్ సంఘము పోలీసులు బలవంతముగా ధాన్యం లాగుకొని పోతున్నారని తీర్మానం చేసి య్యున్నారనియు యీ విషయములను ఋజువుచేయ వలసిందనియు కిసాన్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారిని చల్లపల్లిలో అడిగితిమని యు వారు తగు సమాధానం యివ్వలేక పోయిరనికూడా తెల్పుచున్నారు.

కృష్ణాజిల్లాలో బస్తా 1 కి రు. 18నుండి 25 వరకు దొంగమార్కెట్టులో అమ్మబడు చుండెనన్ని దీనికి కారణం గుంటూరు జిల్లాలో ధాన్యం తక్కువగా సేకరణ జరగడమేనని చెప్పిరి. పశ్చిమగోదావరి జిల్లా చేటపర్రు గ్రామంలో తమ సలహాపై మాగంటి సీతారామదాసుద్వారా 4600 బస్తాల ధాన్యం సేకరింపబడిన దనియు చెప్పిరి.

# గుంటూరు జిల్లా పర్యటనం

తెనాలి, సెప్టెంబరు 2: మద్రాసు ప్రభుత్వ మంత్రియగు వేముల కూర్మయ్య గారు 30-8-47 తేదిని ఉదయము 6 గంటలకు బెజవాడనుండి తెనాలివచ్చిరి. ఇచటినుండి నందివెలుగు గ్రామమునకువెళ్లి అచట బహిరంగసభలో ఉపన్యసించిరి. వీరి వెంట మంతెన వెంకటరాజుగారు యం. యల్. ఏ. నక్కా చినవెంకయ్యగారు (ఆంధ్ర హరిజనసంఘ కార్యదర్శి) కలరు. ఇచటినుండి అత్తోటవెళ్లిరి. భూస్వాములు కనీసము యకరము 1 కి ఒక బస్తా ధాన్యమైనను యివ్వవలెనని మంత్రిగారు బహిరంగసభలో చెప్పిరి. మంత్రిగారు రేషనింగు షాపులోనికివెళ్లి చూచి అచట బియ్యములేనందున వెంటనే బియ్యము తెప్పించవలెనని రేషనింగు డిపార్టుమెంటువారికి మంత్రిగారు ఆర్డరిచ్చారు. అచటినుండి చివలూరుమీదుగా భూమయారు వెళ్లిరి.

### భూమయారు

మంత్రిగారు స్థానిక కాంగ్రెసు సంఘాలకు తమ రాకను తెలియపరచకుండా కాంగ్రెసు సంఘాలను అవమానపరుస్తున్నారని ఇచటి బహిరంగసభలో సమర్పింపబడిన సన్మానపత్రములో చదువబడెను కూర్మయ్యగారు అందుకు సమాధానముగా ఇట్లు చెప్పిరి:- నా సంచార కార్యక్రమాన్ని జిల్లా తాలూకా కాంగ్రెసు సంఘాలకు పంపితిని. నేను పంపినను వారు ఎవ్వరూ నన్ను గణుతించుట లేదు. కాంగ్రెసు కమిటీలు నన్ను గుర్తించినా గుర్తించక పోయినా గాంధీగారి నాయకత్వాన స్వరాజ్యం వచ్చినదిగనుక కాంగ్రెస్ పని తీరిపోయింది. కాంగ్రెసు కమిటీలు పోవాలి. ఆంధ్రరాష్ట్రింలోని కాంగ్రెసు కమిటీలు ఏమీ పని చేయడం లేదు. కాంగ్రెసు ఈ విధంగానే నా సంచార కార్యక్రమం పంపలేదనడం అనవసరం. ఇప్పట్ల ఆంధ్రరాష్ట్రింలోని కాంగ్రెసు కమిటీలు పదవులకోసం ప్రాకులాడడం విచారకరం. కాంగ్రెసు వారు విధిలేక హరిజనునకు మంత్రిపదవి యిచ్చారు గాని వీరు త్యాగంతో యిచ్చిందికాదు. కాంగ్రెసు కమిటీలు చాలా ద్రోహం చేస్తున్నవి. పదవికోసం ప్రాబల్యంకోసం ప్రాకులాడు చున్నవి.

రంగాగారు వోయిలరెడ్డి గార్లు రైతుల వద్దనుండి ధాన్యం బలవంతాన తీసుకొని పోతున్నారనియు, ప్రభుత్వం వారు నిర్బంధం చేస్తున్నారనియు చెప్పడం సరిగా లేదు. మనవద్ద ధాన్యం దాచిపెట్టుకొని బాధ్యతగల రంగా గారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు పట్టణ మనుష్యులకు రేషను యొక్క సక్కర లేదని తమ అభిప్రాయ ప్రకటనలు పత్రికలలో వేస్తారా? ఇది శోచనీయము. హిందూమతం ఆత్మవత్సర్వభూతాని అను ధర్మమును బోధించుచున్నది. పొరుగు వానిని ఠవతో సమానంగా చూడాలి. కాంగ్రెసు కమిటీలు బాధ్యతలేకుండా ప్రవర్తిస్తున్నవి, కాంగ్రెసుకమిటీల కంటె బాధ్యతకలవాడనున్నా అంతబాధ్యత కలదు. రేపు రామరాజ్య రాజ్యంలో మన రాష్ట్రింలో నలుగురు హరిజనుల మంత్రులు రాగలరు. రంగాగారు రైతుకూలి ప్రజారాజ్యం వస్తుందనుచున్నారు. అలాజరిగితీరుతుంది. హరిజనులు వ్యవసాయకూలీలు రాబోయే రాజ్యం వ్యవసాయ కూలీల రాజ్యమేఅని కాంగ్రెసు గ్రహించాలి.

సభలోనుండి ఒకరులేచి ప్రకాశంపంతులు గారు మంత్రిగాఉన్నప్పుడు వారు చేసిన తప్పులేమైనా చెప్పగలరాయని ప్రశ్నించిరి. అందుకు కూర్మయ్యగారు యిలా సమాధానమిచ్చారు. ప్రకాశం పంతులుగారి పై పార్టీ పక్షులకు విశ్వాసం పోయినప్పుడు మిగిలిన మంత్రు లందరితోపాటు వారు కూడా రాజీనామా నివ్వవలసినది. అందరిని పిలిపించి అందరితో సంప్రతించి ఏ పని యైనను చెయ్యాలి. ప్రకాశం పంతులు గారికి నేను చాలా దగ్గరివాడను. నేను వెళ్లి అడిగినప్పుడు "నీకు ఏమీ తెలియదు" అని వారు అన్నారు. అందరిని కూడగట్టుకొని తీసికొని పోయేశక్త్వం ఆయనలో లేదు. హరిజనుల సహాయంతో ప్రధాన మంత్రిత్వం సంపాదించానని ప్రకాశంపంతులుగారు అన్నారు. గాని, ప్రధానమైన వ్యవహారశాఖలగల మంత్రిత్వం వారు నాకు యివ్వలేదు. ప్రకాశంపంతులుగారు నా బినెటుతో సహా (మంత్రివర్గంతో) ఏమీ చెప్పిచేసేవాడుకాడు. ఎక్కువమంది బ్రాహ్మణులకు ఆయన ఉద్యోగాలిచ్చాడు. ఆయన పదవంతా మొండిపట్టుదలతో కూడుకొని యున్నది. మొదటినుంచీ మొండి తనమున్నది. మేమందరమూ రాజీనామాలిచ్చినను లేన పదవికోసం కాను, కాంగ్రెసు హైకమాండువారు కల్పించుకొనేటంత వరకూ ప్రాకులాడుతూనే ఉన్నాడు. ఇప్పుడు హైకమాండుకు వ్యతిరేకభావం లేదు. అని కూర్మయ్యగారు చెప్పిరి.

అటు పిమ్మట తూములూరునుండి సపరివారంగా కొల్లిపర గ్రామమునకు వెళ్లిరి.

కొల్లిపరనుండి రేవేంద్రపాడుకు వెళ్లగా అచట 100 బస్తాల మొక్కజొన్నలు ఇచ్చుటకు వాగ్దానముచేసిరి. అటుపిమ్మట పేరుకలపూడికిని, దుగ్గిరాలకును వెళ్లిరి. దుగ్గిరాల బోర్డుబాలికాపాఠశాలలో కమ్యూనిస్టుపార్టీ రైతుసంఘం తరపున స్వాగత పత్రము సమర్పింపబడెను. అచటినుండి కొలకలూరు వెళ్లి అచటి బహిరంగసభలో ఉపన్యసించి ఆటుతర్వాత కూచిపూడి వెళ్లిరి. ఇక్కడ బహిరంగసభలో ఉపన్యసిస్తూ కొలదిరోజులలోనే కాంగ్రెసు వచ్చిన్నంతా కాగలదని చెప్పిరి. ఇచటినుండి మూల్పూరు చేరిరి. ఈ గ్రామం తరపున, మెట్టతాలూకాలలో కరవునివారణకై 500 బస్తాల ధాన్యము యిచ్చిరి.

సాయంకాలము 4 గంటలకు పెదపూడి గ్రామం వెళ్లిరి. అచట శ్రీ కోటేశ్వర దేవాలయంలోనికి హరిజనులతో కలిసి ప్రవేశించిరి. అటుపిమ్మట అలపాడు వెళ్లిరి. అచట వేణుగోపాలస్వామి మల్లేశ్వరస్వామివార్ల ఆలయములలోనికి హరిజనలను వెంటబెట్టుకునివెళ్లి వేదమంత్రముతో సహా దేవతాదర్శనం చేశారు. ఇచటనుండి సపరివారంగా చుండూరువెళ్లి అచటినుండి పెల్లలూరుకును అచటినుండి మునుపల్లి గ్రామమునకును వెళ్లిరి. అచట బహిరంగసభలో ఉపన్యసించినపిమ్మట పచ్చలతాడిపర్రుకు రాత్రి 11 గంటలకు చేరిరి. ఆ రాత్రి అక్కడ బహిరంగసభలో ఉపన్యసించి అర్ధరాత్రి నిడుబ్రోలుకుచేరి పాములపాటి కృష్ణయ్య చౌదరిగారి యింట విందారగించి రహదారి బంగళాలో విశ్రమించిరి.

గుంటూరు నరసింహారావు, యం. యల్. ఏ. వేదూరి నాగేశ్వరరావు యం. యల్. ఏ. మంతెనవెంకటరాజు యం. యల్. ఏ గార్లు మంత్రికూర్మయ్యగారి వెంట పంచారముచేసిరి. పొన్నూరులో జరిగిన బహిరంగసభలో ఉపన్యసించిన పిమ్మట చందవోలు గ్రామమునకు వెళ్లిరి. చందవోలు నుండి కర్లపాలెమునకు విచ్చేసిరి.

మధ్యాహ్నమునకు బాపట్ల వచ్చిరి. మంతెన వెంకటరాజు యం. యల్. ఏ గారింట మంత్రిగారిక్క విందు చేసిరి. మంత్రి కూర్మయ్యగారు నిన్నరాత్రి రైలులో బందరు వెళ్లిరి.

### పొన్నూరు

గుంటూరుజిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ బాచిన సుబ్బారావుగారు ధాన్యసేకరణ విషయములో మంత్రిగారికి తోడ్పడుటకు వారివెంట వచ్చిరి. మంత్రిగారు పొన్నూరు కాంగ్రెసువారు ఏర్పాటు చేసిన విందు వేళకు రాలేకపోయిరి. రాత్రి 12 గంటలకు నిడుబ్రోలువచ్చి పాములపాటి కృష్ణయ్యగారింట భోజనము చేసిరి. ఉదయము 9గంలకు రామమందిరము వద్ద గ్రామపురోభివృద్ధి ప్రచారకసంఘము వారు సమర్పించిన స్వాగతపత్రమును స్వీకరించిరి. అచటినుండి గంకోలు, కర్లపాలెం, హైదరుపేట, ఉప్పరెట్టమీదుగా బాపట్ల వెళ్లిరి.

### బాపట్ల

1-9-47 తేదీ ఉదయము 10 గంటలకు రావలసినది మధ్యాహ్నము 1½ గంటలకు మంత్రి కూర్మయ్యగారు సపరివారంగా బాపట విచ్చేసిరి. గాంధీహరిజన హాస్టలు విద్యార్థులు స్వాగతమొసంగిరి. ఆరోనరావు (యం. యల్. ఏ.) గారి అధ్యక్షతను జిల్లా లేబరు మ్యూలు టీచర్ల కాన్ఫరెన్సు జరిగెను.

మంత్రిగారి దర్శనార్థమై ఒయట చేరియున్న జనుల సమావేశములో అటుపిమ్మట యోపన్యసించిరి. "రంగాగారు ధాన్యము నకు ఎటు పంపవలెననియు, యిప్పటి సరకు ధాన్యం యివ్వవద్దనియు ప్రచారము చేయుటవల్ల" అని కూర్మయ్యగారు అనగానే ఆ మాటలు ఉపసంహరించుకోవలెనని జనులు కేకలు వేసిరి. వెంటనున్న జిల్లా కాంగ్రెసు సెక్రటరీగారు కూడా ఎప్పుడునూ యిటువంటి ప్రచారము జరిగియుండలేదనియు ఆ మాటలను ఉపసంహరించుకోవలెననియు కోరిరి. సభలో పెద్ద అలజడి బయలుదేరెను. మంత్రిగారు తమవద్ద పత్రికలలోనుంచి కత్తిరింపబడిన వ్యాసములు ఆధారముగా అన్నవని చెప్పిరి. బాపటలోని డిపోలకు సక్రమంగా బియ్యం అందలేదని డిపో సంఘపు అధ్యక్షుడు శ్రీ దేవదానంగారు చెప్పిరి. రెండురోజులకో మూడు రోజులకో బియ్యం అమ్మవలసి వస్తున్నదని కూడ చెప్పిరి. మంత్రిగారు అధికంగా బ్లాకు మార్కెట్టు లంచములడిగిన మిల్లు యజమానుల జాబితా తీసికొన్నారు మిల్లు యజమానులపై తగు చర్య జరిపెదమని చెప్పిరి. అనంతరము రాత్రి 9½ గంలకు బెజవాడకు వెళ్లిరి.

# కడపలో మంత్రి సీతారామరెడ్డిగారి ప్రచారం

కడప, సెప్టెంబరు 8: మద్రాసు ప్రభుత్వ పారిశ్రామికశాఖా మంత్రియగు శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారు ధాన్యసేకరణ విషయములో ప్రజలను ప్రోత్సహించు నిమిత్తమై కడపజిల్లాలో పర్యటనము చేసిరి.

చెన్నూరులో ఉపన్యసిస్తూ రాబోవు రెండునెలలు చాలా కష్టకాలమనియు ఈ జిల్లాలోని పంటను యీ జిల్లా ప్రజలందరికి లభ్యమగునట్లుగా భూస్వాములు తమధాన్యమును యివ్వవలెనని చెప్పిరి. అటుపిమ్మట ఖాజీపేట గ్రామమునకును ముసలకేతుల గ్రామమునకును వెళ్లి అచట బహిరంగ సభలలో ఉపన్యసించిరి. నిన్నరాత్రి అనగా 2 తేదీరాత్రి కడప మునిసిపల ట్రావెలర్సు బంగళాలో దిగిరి. ఇంతవరకు బట్వాడా కాక నిలువయున్న 200 మిల్లుబట్టల బేళ్లను తక్షణము ప్రజలకు బట్వాడా చేయుటకు ఏర్పాటు చేయవలెననియు ఆలస్యమైన యెడల వ్యాపారస్థులకు నష్టము కలుగుననియు వ్యాపారస్థులకు ఎంతమాత్రమూ నష్టము కలుగకుండు లాగున చూడవలెనని అసిస్టెంటు ఇన్‌స్పెక్టింగు టెక్స్టయిలు కమీషనరు గారికి మంత్రి సీతారామరెడ్డిగారు ఉత్తరువు చేసిరి.

కడపలో కళాశాలను నిర్మించుటకొరకై ఉద్దేశించిన ప్రదేశమును కళాశాలా సంఘాధ్యక్షులైన యన్. రంగారెడ్డిగారు మంత్రిగారికి చూపించిరి. జిల్లా కలెక్టరు బంగళాకును, జిల్లాజడ్జి బంగళాకును మధ్యనున్న ప్రదేశము కళాశాలకు చాలా యోగ్యమైనదిగా నున్నదని మంత్రిగారు చెప్పిరి.

కడపజిల్లా రెవిన్యూ ఉద్యోగులును ఆహార శాఖోద్యోగులును సమావేశమైన సభలో సీతారామరెడ్డిగారు నిన్న ఉదయం ఇట్లు ఉపన్యసించిరి. ఇదివరకు సింధు, పంజాబు రాష్ట్రములనుండి యీ రాష్ట్రమునకు ధాన్యము దిగుమతి యగుచుండెను, కాని అవి పాకిస్థానులో చేరుటవల్ల మన కిప్పుడవి లభించవు. ఇండియను యూనియన్‌లోని రాష్ట్రములన్నిటికంటే చిన్న రాష్ట్రములో ఆహారోత్పత్తి చాల తక్కువగా వున్నది. ఈ కడపజిల్లాలో వసూలు కావలసిన 10 వేల టన్నుల బియ్యమునకును, 4,600 టన్నుల జొన్నలు వగైరా మెట్ట ధాన్యములకును సగము మాత్రమే వసూలు అయినట్లుగా లెక్కల వల్ల కన్పించుచున్నది. జిల్లా ఆహార సప్లయి శాఖాధికారియైన శ్రీ వి. కామేశ్వరరావు గారు మంత్రిగారి విజ్ఞాపనకు బదులు చెప్పుచు యిట్లు పన్యసించిరి.

ఇంటింటికి వెళ్ళి ధాన్యమును ప్రోగుచేయుట ప్రారంభించినందువల్ల మొదటి 6 మాసములలో యీ జిల్లాలో ఎంతధాన్యం సేకరింపబడెనో అంతధాన్యము గత రెండు నెలల్లో యీ జిల్లా ఆహార శాఖ వారు సంపాదింపగలిగిరి. రాయచోటిలో రెండవ కారు పైరు కోతకువచ్చింది. సజ్జ పైరు కూడ కోతకు త్వరలోనే వచ్చును. కనుక ఏదో ఒకరీతిగా రాబోవు రెండు నెలల కాలము ప్రయాసపడి ప్రజలకు ధాన్యము పంచిపెట్టగలమను నమ్మకము నాకు కలదు. రేషనింగు ప్రదేశములకు కడప, ప్రొద్దుటూరు పట్టణములకు మాత్రము ప్రభుత్వమువారు బియ్యము సప్లయిచేసినచో చాలు నని చెప్పిరి.

### వల్లూరు

సెప్టెంబరు 3 వ తేది ఉదయము సీతారామ రెడ్డిగారు జిల్లాకలెక్టరయిన ఆర్. యస్. మలయప్పనుగారితోను రంగారెడ్డి (యం. యల్. సి.) గారితోను స్వర్ణ నాగయ్యగారు (యం. యల్. ఏ.) గారితోను కలిసి వల్లూరు గ్రామము వెళ్లిరి. వల్లూరు గ్రామవాసులు యివ్వవలసిన ధాన్యమును పూర్తిగా యిచ్చినందుకు వారిని అభినందించుచున్నామని బహిరంగముగ సభలో మంత్రిగారు చెప్పిరి.

గ్రామస్థులు ఒక చిన్న కాలేజీను తమ సొంత ఖర్చుతో ప్రవ్వుకొనుటకు అనుజ్ఞ యివ్వవలెనని కోరిరి. అందువల్ల 300 యకరములు సాగులోనికి రాగలవనిచెప్పిరి. వెంటనే మంత్రిగారు ఆ కార్యమును త్వరలో నెరవేర్పవలెనని జిల్లా కలెక్టరుగారితో చెప్పిరి.

అటుపిమ్మట మంత్రిగారు కమలాపురం వెళ్లిరి. ఈ ఊరిలోని చెరువును కొన్ని మరమ్మతులు చేసినయెడల 1,000 యకరములలో సాలుకు రెండుపైరులు రాగలదని పుల్లారెడ్డిగారు విన్నవించిరి. దాని విషయమై తగు చర్య తీసికొనెదనని మంత్రిగారు చెప్పిరి. ఇచటి ప్రజలు రెండు దినములలో 56 పుట్ల వడ్లు ఇచ్చెదమని వాగ్దానముచేసిరి.

కళాశాల విషయమై మంత్రిగారిని ప్రశ్నించగా రాబోవు జూనుమాసములో కడపలో కళాశాల స్థాపింపబడునని చెప్పిరి.

మంత్రిగారు నిన్న ఎక్స్‌ప్రెస్‌లో తిరిగి చెన్నపట్నము వెళ్లిరి.

# ప. గోదావరిజిల్లాలో ధాన్య సేకరణ

నిడదవోలు, సెప్టెంబరు 6: పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరుగారు కొంతమంది ధాన్యసేకరణ సిబ్బందితో పేరవలి వద్ద మూడుపడవల నిండా ఉన్న మంచి బియ్యమును పట్టుకొన్నారు. ఆ బియ్యమును పోలీసు వారు స్వాధీనము చేసుకొన్నారు. కొవ్వూరు తాలూకా సప్లయి ఆఫీసరు గారు మద్దూరు వద్ద 119 బస్తాల బియ్యమును పట్టుకొన్నారు. ఆ బియ్యమును మద్దూరు గ్రామమునసబు గారు స్వాధీనము చేసుకొన్నారు.

పెనుగొండలోని మిల్లులలో సుమారు 1600 బస్తాల ధాన్యమున్ను, నిడదవోలులోవున్న మిల్లులలో సుమారు 1100 బస్తాల ధాన్యమును ఆహార శాఖోద్యోగులు సీలు వేసినట్లు తెలిసింది.

# 6300బస్తాలధాన్యం

ఏలూరు, సెప్టెంబరు 8: స్థానిక రెవెన్యూడివిజనల్ ఆఫీసర్ శ్రీ కె. సాంబశివరావునాయుడు, ధాన్యంకొనుగోలు తహసీల్దారు శ్రీ ఆకొండలరావునాయుడు గార్లు ఏలూరుతాలూకాలో గ్రామాల్లో రైతులవద్ద ధాన్యసేకరణకు సంచారం చేస్తున్నారు. గతవారంలో పూళ్ల, మల్కీ మహమ్మదన్‌పురం, దెందులూరు గ్రామాల్లో 6000 బస్తాలు సేకరించారు. నిన్న జాలిపూడి, మాదేపల్లి, గుండుగొలను గ్రామాల్లో 1800 బస్తాలు సేకరించారు. ఇవన్నీ వెంటవెంటనే మిల్లులకు పంపించేఏర్పాట్లు చేయబడినాయి. స్వ. వి.

## భీమవరం తాలూకా

భీమవరం, సెప్టెంబర్ 3: ఈతాలూకా అన్ని గ్రామాలలోను ధాన్య సేకరణ సిబ్బందివారు సంచారము చేసి వీలయినంత ధాన్యమును సేకరించుచున్నారు. ఈ జిల్లా కలెక్టరు, డిప్యూటీకలెక్టరు గార్లు పోలీసు సిబ్బందితో చాల గ్రామములు సంచారము చేసి సుమారు 4000 బస్తాల ధాన్యమును సేకరించినట్లు తెలిసింది. (స్వ.వి)

### అమలాపురం ఫిర్కా

అమలాపురం, సెప్టెంబరు 2: ధాన్య సేకరణకై రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, తహసీల్దారు, ఫిర్కా సప్లయి ఆఫీసర్లు ప్రతి యింటికి తిరిగి రెండు బస్తాల చొప్పున కూడ పోగుచేయుచున్నారు. దేశములోని ఆహార పరిస్థితిని గురించి ప్రజలకు నచ్చ చెపుతున్నారు. కాని ఎక్కువగా ధాన్యమున్న యీ ప్రదేశములో కూడ రేషను డిపోలలో ఏరోజు రేషను ఆరోజునే ఇచ్చుచున్నారు. (స్వ.వి)

### రేషను బియ్యం కొనుగోలుదార్ల సభ

ఏలూరు, సెప్టెంబరు 2: నిన్న సాయంకాలం పెన్నకల్లివారి పేటలో శ్రీ కలగర నాగభూషణం చౌదరిగారి అధ్యక్షతను రేషను బియ్యం కొనుగోలుదార్ల సభ జరిగింది. ఈ పట్టణంలో రేషనుషాపులన్నిటిలోను, 2 వ రకం బియ్యం 3 వ రకం బియ్యములను మొదటిరకం బియ్యం క్రింద చలామణీ చేయడం, అధికాంశం వడ్లు బెడ్డలు కలిపి అమ్మడంవల్ల, బియ్యం కొనుక్కునే ప్రతివారూ చాలా యిబ్బంది పడుతున్నారని పలువురు ఉపన్యసించారు.

ఈ విషయాలన్నియు అధికార్లకు నివేదించి పరిస్థితులు సరిచేసేనిమిత్తం సభవారు శ్రీయుతులు రాయుడు గంగయ్య, నరాలసెట్టి జార్జి, నీలం వెంకయ్య, బి. ధర్మయ్య ఎం. రాములు గార్లను ఒక ఉపసంఘంక్రింద నియమిస్తూ తీర్మానించారు. ఈ విధంగానే పట్టణంలో యితరప్రాంతాలలోకూడా కొనుగోలుదార్ల సంఘములను ఏర్పాటుచేయడానికి నిర్ణయింపబడింది.

మొన్న సాయంకాలం శ్రీ నరాల సెట్టి జార్జిగారి అధ్యక్షతను పట్టణ ఆది ఆంధ్ర సంఘంవారు సమావేశమై ఇదేమాదిరి తీర్మానాలు చేశారు. స్వ. వి.

# బియ్యం దొంగతనం

## కమ్యూనిస్టులమీద పోలీసు కేసు

కాకినాడ, సెప్టెంబరు 2: ఉప్పాడ సముద్రం వద్ద దొంగతనంగా తీసికొని పోబడుచున్న 27 బస్తాల బియ్యమూ, 2 బస్తాల ధాన్యం ఫిర్కా సప్లయి ఆఫీసరు పోలీసుసహాయంతో పడవలోజాల క్రింద పట్టుకున్నారు. ఆ సరకును అచ్చటనుండి పిఠాపురం తీసికొని పోనీకుండా కొంతమంది గ్రామస్థులు, కమ్యూనిస్టులు అటకాయించారనే కారణంమీద 147, 149, 353, 882 సెక్షన్ల క్రింద ఆర్. వి. జగ్గారావు, సి. చిన్న, డి. కొండయ్యలోను, జగన్నాత్రిరాజు ఇంకా మరి కొంతమంది మీద పిఠాపురం స్టేషనరీ సబు మేజస్ట్రీటు యెదుట పోలీసులు కేసు పెట్టారు. (స్వ. వి.)

# గుంటూరు జిల్లాలో కాటకపరిస్థితి

## బాచిన సుబ్బారావుగారి ప్రకటన

తెనాలి, సెప్టెంబరు 4; గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ బాచిన సుబ్బారావుగారు క్రింది ప్రకటన చేయుచున్నారు:

గుంటూరు జిల్లా మెట్ట ప్రాంతాలలో కరువు పరిస్థితులు రోజురోజుకు విషమించుచున్నవి. రేషన్ షాపులు నెలలో దాదాపు 26 రోజులు మూతబడి ఉంటున్నాయి. ప్రజలు పొరుగుగ్రామాల నుండి బియ్యము తెచ్చుకుంటున్నప్పుడు అధికారులు వారిమీద కేసులు పెట్టుచున్నారు. రైళ్లన్నీ బియ్యంకోసం ఇతర గ్రామాలకు పోవుచున్న జనముతో క్రిక్కిరిసి పోవుచున్నవి. పరిస్థితులు యీ విధముగనే యున్నయెడల ఆకలి బాధకు ప్రజలు బలి అగుటయేగాక, అరాజకమునకు గూడ దారితీయకలదు. బియ్యం లేక రేషనుషాపులు మూసివేసిన ప్రభుత్వము, ప్రాణాలు నిలుపుకొనుటకై ధాన్యము తెచ్చుకొంటున్న ప్రజలను ఆపుచేయుటలో అర్థములేదు. ఈ పద్ధతిని వెంటనే తొలగించుట అవసరమని ప్రభుత్వమును విజ్ఞప్తి చేస్తున్నాను. దిక్కులేని ప్రజల ప్రాణాలు నిలుపుకొనుటకు బియ్యం తీసికొని వెళ్లుతుంటే పోలీసులు పట్టుకొని కేసులు పెట్టారు. అట్టి కేసులు రద్దు పరచుట ప్రభుత్వము యొక్క కనీస ధర్మమై యున్నది.

# ఉత్పత్తి వినియోగదారుల సహకార సంఘాలు

## కార్యదర్శులనుతీసివేయవలసిందని ప్రభుత్వ ఉత్తర్వులు

భీమవరం, సెప్టెంబర్ 4: స్థానిక ఉత్పత్తి వినియోగదారుల సహకార సంఘం కార్యదర్శిని తీసివేయవలసిందని ప్రభుత్వం అధ్యక్షునికి ఉత్తరువుపంపారు. దానిమీదట సంఘం అధ్యక్షుడు శ్రీ బొండాడ బంగారాజు గారు, సంఘం చాలా వ్యాపారములతో లాభసాయకంగా పనిచేస్తున్నదనీ, ప్రస్తుతం లక్ష రూపాయలు విలువచేసే సరుకులతో వ్యాపారం జరుగుతున్నదని, కార్యదర్శిని తీసివేస్తే చాలా చిక్కులు కలుగుతుందనీ, కనుక కార్యదర్శిని తీసివేయజాలమనీ, ఆ ఉద్యోగమునుంచవలసిందనీ టెలిగ్రాముద్వారా ప్రభుత్వానికి తెలియచేశారు.

ప్రభుత్వం వద్దనుంచి ఇదేమాదిరి ఉత్తరువులు ఈ జిల్లాలోని అన్ని సంఘాలకు వచ్చినట్లు తెలిసింది. (స్వ. వి.)

# ఓషధి మూలికల పరిశోధన

మదరాసు, సెప్టెంబర్ 6: భారతీయ ఓషధి మూలికల విషయమై యిదివరకు ఎవుగని పరియైన ప్రయోజనములను లక్షణాలను పరిశోధించుటకు ఒక స్కీము ను ప్రభుత్వంవారు ఆమోదించి యున్నారు. అడవులలో తనిచ్చగా పెరిగేమూలికలయు నివేశాలలో పెరిగే మూలికలయొక్కయు లక్షణాలను పరిశీలించి సామాన్యంగా పొలాలలో పెరుగగల ఓషధి మొక్కలతో అంటుపేస్తే అజాతిని యెంతవరకు అభివృద్ధిపరచ వీలగుననే విషయముకూడా పరిశోధించుటకు ప్రభుత్వము స్కీముకు ఉత్తరువుచేసి యున్నది. ఇదే రీతిగా యిపుడు రెల్లు గడ్డిని చెరుకును అంటు వేయుటవల్ల మంచిరకం చెరుకు ఉత్పత్తియగుచున్నది. ఈపరిశోధన కేంద్రాలు, అనకాపల్లి, సిరుగుప్ప, ఉదకమండలము, మైసూడ్, ఆరంటాంగిలలో నుండును.

### వ్యవసాయదార్లకు నీటిగొట్టాల సప్లయి పర్మిట్లు

మదరాసు, సెప్టెంబరు 6: అధికాహారోత్పత్తి ఉద్యమం నిమిత్తం వ్యవసాయదార్లకు వలయు పరికరాలందుట చాలా ఆలస్యమగుచున్నదని పిర్యాదులు అందిన కారణమున నీటిగొట్టాలకు యిదివరకు వ్యవసాయశాఖ డైరెక్టరు పర్మిట్లను యిస్తూ వచ్చేరీతిగా కాకుండా యికమీద జిల్లా అధికారులే పర్మిట్లు యివ్వటానికి అధికారమిస్తూ ప్రభుత్వంవారిపుడు ఉత్తరువు చేసియున్నారు. దీని ఫలితంగా జిల్లా అధికారులు 60 అడుగుల నీటిగొట్టాలకు పర్మిట్లు యివ్వగలరు.

# రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా

## ఎగుమతిదారులకు నోటీసు 1947 నెం. 1

ఎగుమతి సరకుల పూర్తి విలువకు సరైన విదేశమారకద్రవ్యము రిజర్వు బ్యాంక్ ఆఫ్ యిండియావారు ఆమోదించిన పద్ధతిలోను, కాలపరిమితిలోను వినియోగింపబడియుండినట్లు లేదా వినియోగింపబడనున్నట్లు డిక్లరేషన్ యిచ్చిన తప్ప, ప్రస్తుత నియమముల ప్రకారము ఇండియానుండి కొన్ని నిర్దిష్టమైన దేశములకు ఏసరకుల ఎగుమతియైనను అనుమతింపబడదు. 1947 అగస్టు 19 వ తేదీనుండి అమలులోనికి వచ్చునట్లుగా ఇండియా గవర్నమెంటువారు 4-8-1947 తేదీనాటి నెం. 12 (17)-F1/47 నోటిఫికేషన్ ద్వారా ఈపద్ధతిని ఆఫ్‌గనిస్థాన్ నేపాల్, టిబెట్, పోర్చుగీసు, ఫ్రెంచ్ యిండియా తప్ప అన్ని దేశములకు విస్తరింపజేసియున్నారు. అందువల్ల ఎగుమతి సరకుల పూర్తివిలువకు సరియైన విదేశమారక ద్రవ్యము ఆమోదించిన పద్ధతిలో వినియోగింపబడియుండినట్లు లేదా వినియోగింపబడనున్నట్లు డిక్లరేషన్ యిచ్చిన తప్ప 1947 అగస్టు 19 వ తేదీనుండి పైన తెలిపిన దేశములకు తప్ప తదితర దేశములకు ఇండియానుండి సరకులను ఎగుమతి చేయుటకు కస్టమ్సు శాఖవారు అనుమతింపరు. G. R. 1 ఫారంలోను G. R. 2 ఫారంలోను G. R. 3 ఫారంలోను ఎగుమతిదార్లు డిక్లరేషను యిచ్చి అందులో సొమ్ము యేవిధముగా తీసికొనుచున్నది సూచింపవలెను. దిగువ 4 పేరాలో సూచించిన మాదిరి G. R. 1 ఫారం ప్రకారం ఎగుమతిచేయదలచిన ఫలు విషయములలో తప్ప ఎగుమతులకు సంబంధించిన షిప్పింగ్ డాక్యుమెంట్లు మారకపు బ్యాంకుద్వారా పంపవలసియున్నది. ఈ బ్యాంకులు విదేశమారకద్రవ్యములో లావాదేవీలు జరుపుటకు అధికారము పొందిన బ్యాంకులై యుండవలెను. బ్యాంకు పేరు G. R. ఫారముమీద తెలుపవలెను.

2. ఇండియా గవర్నమెంటు నోటిఫికేషను వర్తించు దేశముల కన్నిటికి ఇండియానుండి ఎగుమతిచేయుటకు ప్రస్తుతపు జి. ఆర్. 1 ఫారమును వుపయోగించవచ్చును. బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండుతో ప్రత్యేకపు యేర్పాటు చేసికొని యునైటెడ్ కింగ్డంకు వెలుపలి దేశములకు షిప్‌మెంట్లు పంపుచున్నప్పుడు గాని, విదేశమారక ద్రవ్యములో లావాదేవీలు జరుపుటకు అధికారము పొందిన బ్యాంకుద్వారా తమ డాక్యుమెంట్లుపంపవలసిన అగత్యము లేకుండ షిప్పర్లు ప్రత్యేక యేర్పాటు చేసికొనగోరినపుడు గాని, జి. ఆర్. 3 ఫారము నుపయోగింపవలెను. ఇండియానుండి చేయబడు ఎగుమతుల ఖరీదుక్రింద సొమ్ము తీసికొనుపద్ధతులు ఆయా ఫారములమీద వివరముగా తెలుపబడినవి.

3. ఇండియానుండి ఎగుమతి చేయబడు సరకుల తాలూకు షిపింగ్ డాక్యుమెంట్లు అన్నియు విదేశమారక ద్రవ్యములో లావాదేవీలు జరుపుటకు అధికారము పొందిన బ్యాంకులద్వారా పంపవలెను. బ్యాంకుపేరు కస్టమ్సువారికి పంపబడు ఫారముల ఒరిజనల్ కాపీమీద వ్రాయవలెను. డిక్లరుచేసిన బ్యాంకునుండి గాకుండ ఇతరత్రా సొమ్ము తీసికొనుయెడల, ఈ విషయము ఎర్రసిరాలో జి. ఆర్. 1, 2 ఫారములమీదను, ఇందుకు సంబంధించిన ఆధర్ర్డులు డీలరుకు పంపబడు యితర కాపీలమీదను వ్రాయవలెను. రిజర్వుబ్యాంకుతో ప్రత్యేక యేర్పాటుచేసుకొన్న తప్ప, సొమ్మునుగురించి జి. ఆర్. 1, 2 ఫారములలో విధింపబడిన పద్ధతులు మినహా తదితరమైనవి అనుమతింపబడవు.

4. తమ ఎగుమతులకు సొమ్మును బ్యాంకులద్వారా తీసికొను ఆచారములేక ఎగుమతి సరకుల అమ్మకం బాపతు సొమ్ము విదేశములలోని బ్రాంచీలలో నిలవయుంచి, దరుమతులను, ఇండియాకు దిగుమతి చేయబడు సరకులక్రింద వినియోగించుకొను షరముల లావాదేవీలకు సంబంధించి జి ఆర్. 3 కాపీఫారము యేర్పాటుచేయబడినది. పైన తెలిపిన నియమములకు లోబడి చిరకాలము నిరంతరాయముగా జరుగుచుండుటుకంటే యేర్పాట్లను అనుమతించుటయే రిజర్వుబ్యాంకువారి ఉద్దేశము.

(a) సాధారణ నియమములకు మినహాయింపు చేయదగినంత భారీగా వ్యాపారము వుండవలెను. లేదా, సరకులు ఎగుమతి చేయబడుచున్న స్థలములలో బ్యాంకింగ్ సౌకర్యములు లేకుండ యుండవలెను.

(b) రిజర్వుబ్యాంకు వారికి తృప్తికరమైన విధముగా ఎగుమతిసొమ్ము విషయమై ఎగుమతిదారు లెక్క చెప్పగలిగియుండవలెను.

రిజర్వుబ్యాంకునుండి నిర్దిష్టమైన యిక్స్ప్రెస్ సెనిదే, జి. ఆర్. 3 ఫారంలోని డిక్లరేషనులను కస్టమ్సు ఉద్యోగులు అంగీకరింపరు. జి. ఆర్. 3 ఫారం మీద డిక్లరేషనులక్రింద, ఏ ఎగుమతి దారైనను, సరకులను షిప్పింగుచేయ దలచిన యెడల, స్పెషల్ లైసెన్సుగాను రిజర్వుబ్యాంకుకు దరఖాస్తు పెట్టుకొనవలెను. ఎగుమతి చేసిన సరకుల అమ్మకపుసొమ్ము విషయమై పరియైన లెక్కలను వుంచుటకు తృప్తికరమైన యేర్పాట్లు జరిగినమీదటనే లైసెన్సు యివ్వబడును.

5. ఫారం G. R. 3 మూడుకాపీలుగా పూర్తిచేసిపంపవలెను. మొదటికాపీ షిపింగ్ బిల్లుతో కలిపి కస్టమ్సుకు పంపవలెను. రెండవకాపీ షిప్పరుయొక్క ఇన్‌వాయిస్ కాపీతోకలిపి సదరు విదేశీమారకపుమొత్తము భారతదేశమున ఏవిధముగా తీసికొనదలచినదియు తెల్పుచు రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియాకు నేరుగా పంపవలెను. మూడవకాపీ వద్ద ఉంచుకొని రిజర్వుబ్యాంకు చేసిన ఏర్పాట్ల ప్రకారము సొమ్ము వసూలయినపుడు పంపవలెను.

6. ప్రాతస్టెర్లింగ్ ఏరియాకు వెలుపల ఉండి బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండుతో తమ లండన్ ప్రిన్సిపాల్సువలన చేసికొన్న ప్రత్యేకపు ఏర్పాటుక్రింద స్టెర్లింగులో పెట్టబడి జరుపబడుచున్న దేశములకు షిప్‌మెంట్ల విషయమున ఫారం G. R. 3 ద బదులు ఫారం G. R. 2 నే ఉపయోగింపవలెను. ఎగుమతిదార్లు స్టెర్లింగ్ ఏరియాకు షిప్‌మెంట్లకు ఫారం G. R. 3 లో లెక్క చెప్పు మాదిరిగే రిజర్వుబ్యాంకుకు షిప్‌మెంట్ల యొక్క స్టెర్లింగ్ మొత్తములకు లెక్క చెప్పవలెను.

7. F. O. B. కంట్రాక్టుక్రింద షిప్‌మెంటు చేసినపుడు ఎగుమతిదారు తాను పూర్తిజేసిన ఫారంయొక్క కాపీలన్నిటిలోను "వస్తువుల ఇన్‌వాయిస్ విలువ" "Invoice value of goods") అను కాని క్రిందుగ "ఇది F. O. B. కంట్రాక్టు క్రింద" అని తెల్పవలెను. షిప్‌మెంటువలన ఏర్పడిన సక్రమమైన వ్యాపారపు ఛార్జీలు నీగ్ర రాలక్రింద "వస్తువుల ఇన్‌వాయిస్ విలువ" ("Invoice value of goods") గా చూపబడిన మొత్తమునుంచి మినహాయింపులుగాని ఆ మొత్తములో సర్దుబాటులుగాని చేసినపుడు ఎగుమతిదారు పూర్తిజేసిన సంబంధపు ఫారంలో అవి వివరముగా తెల్పవలెను.

8. మారకపు కంట్రోలుకు సంబంధించిన నిబంధనలలో గాని విధానములలో గాని వివియు ఎగుమతిచేయుటకు లైసెన్సు పొందవలసి వస్తువుల విషయమున ఎక్స్‌పోర్టుట్రేడ్ కంట్రోలరునుంచి ఎగుమతిదారు అట్టి ఎగుమతి లైసెన్సు పొందవలసిన అగత్యమును తప్పింపవని స్పష్టముగా తెలిసికొనవలెను.

9. షిప్పర్లు G. R. 1, G. R. 2 లేక G. R. 3 ఫారంలలో తప్పు డిక్లరేషను ఇచ్చినచో 1947 ఫారిన్ ఎక్స్చేంజి రెగ్యులేషన్ చట్టముక్రింద అబద్ధపు ప్రకటనగాను శిక్షార్హులు కాగలరని తిరిగి తెల్పడమైనది. మరియు, ఈ ఫారంలమీద తప్పురిపోర్టుచేయుటవలన ఎగుమతిచేయుటకు అనుమతి సంపాదించినట్లు తేలినచో ఏ షిప్పరుకుగాని అపైన షిప్‌మెంట్లు చేయుటకు అనుమతి నిరాకరింపబడవచ్చును.

10. ప్రయాణీకుల స్వంత వస్తువులు, షిప్పుల స్టోర్లు, ట్రాన్‌షిప్‌మెంటు కార్గో ను పై పేరాలలో తెల్పబడిన నిబంధనలు వర్తించవు గనుక వీటి ఎగుమతిని అనుమతించుటకు ఒక కలెక్టర్ ఆఫ్ కస్టమ్సుకు అధికారమివ్వబడియున్నది. ఇదేవిధముగ కేంద్ర ప్రభుత్వపు ఆర్డరుక్రింద గాని, కేంద్రప్రభుత్వముచే ఇందుకుగాను నియమింపబడు ఉద్యోగుల ఆర్డరుక్రిందగాని, మిలిటరీ, నావిక, విమానపు అవసరములకుగాను భారతదేశములోని మిలిటరీ, నావిక, వైమానిక అధికార్ల ఆర్డర్ల క్రిందగాని పంపబడు వస్తువులకును సదరు నిబంధనలు వర్తింపవు.

11. G. R. 3 ఫారం కాపీలు ప్రతి కస్టమ్సుహౌస్‌లోను దొరకును. విదేశమారకమునకు అధికారము పొందిన డీలర్లకు దరఖాస్తుపెట్టి కూడ తెప్పించుకొనవచ్చును.

12. ఈ నోటీసు ఈ విషయమునకు సంబంధించిన ఇంతకుపూర్వపు ఇన్‌స్ట్రిక్షనుల నన్నిటిని రద్దుచేయుచున్నది.

# ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

## కొన్ని సెక్షనులపై చౌక మూడవక్లాసు ఛార్జీలు రద్దుచేయుట.

పాకాల-ధర్మవరం-అనంతపురం,
బళ్ళారి-రాయదుర్గం,
హాస్పేట - కొట్టూరు,
హాస్పేట - స్వామిహళ్లి,

సెక్షనులపై ఏ రెండు స్టేషనులకు మధ్యనైనా మైలుకు 3 పైసల చొప్పున గల చౌక సింగిల్ ప్రయాణపు మూడవతరగతి ఛార్జీలు 1947 సంవత్సరం అక్టోబరు 1 వ తేది నుండి రద్దుచేసి తీసివేయబడి, ఇతర సెక్షనులపై ఉన్నట్టుగా మామూలు ఛార్జీలు యీ సెక్షనులపైకూడా అమలుపర్చబడును.

## బెజవాడ మ్యునిసిపలు ఎన్నికల తికమకలు

### అయ్యదేవర కాళేశ్వరరావు గారి ప్రకటన

మచిలీపట్నం, సెప్టెంబరు 5: శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు యం. యల్. ఏ. యిట్లు వ్రాయుచున్నారు:

బెజవాడ మ్యునిసిపలు ఎన్నికలను జరిపించుటకై కోదండ రామారెడ్డిగారు అక్టింగు స్పెషలు ఆఫీసరుగా నియమింపబడిరి.

కాంగ్రెసు సంఘమువారిచే అధికారరీత్యా నియమింపబడిన 20 మంది సాధారణ అభ్యర్థులకు వేయవలసిన వోట్ల నిమిత్తమై పచ్చరంగు బాలటు పెట్టెలను ఏర్పాటు చేసిరి. ప్రత్యేకింపబడిన 7 స్థానములకు కాంగ్రెస్ కమిటీ వారిచే నియమింపబడిన 7 గురు అభ్యర్థులకు వోట్లు వేయుటకై చారపట్టీ కల్గిన పచ్చపెట్టెను బాలటు పెట్టిగా ఏర్పాటుచేసిరి. గవర్నమెంటు రూల్సు ప్రకారంగా వారు యీ రీతిగా ఏర్పాటు చేసిరి.

కాని విజయవాడ కాంగ్రెస్ వర్కర్సు సెంట్రల్ కమిటీ పార్టీవారి తాలూకు 16 మంది సాధారణ స్థానముల అభ్యర్థుల వోట్ల నిమిత్తమై, పచ్చపెట్టెలను నీలపు రంగు చక్రముగలవి ఏర్పాటు చేసిరి. పై జెప్పిన పార్టీవారికి సంబంధించిన ప్రత్యేక స్థానాల 7 గురు అభ్యర్థులవోట్ల నిమిత్తమై పచ్చపెట్టెలను నీలపురంగు చక్రమున్నూ ఒక చారయున్నూ కలవి ఏర్పాటుచేసిరి.

ఈవిధముగా రెండు ప్రతికూలపక్షముల వారికిన్ని పచ్చరంగు పెట్టెల ఏర్పాటు చేయుట వోటర్లను కంగారుచేసి తికమక పరచును. ఈ విషయమై అధికారులవారికి తెలియజేయుట మైనది. కాని ప్రయోజనము లేకపోయెను.

ఏపార్టీకి చెందకుండా స్వతంత్రముగా ఎన్నికలకు నిలుచబడుచున్న 14 మంది అభ్యర్థులకు కాంగ్రెసు త్రివర్ణములుగల బాలటు పెట్టెలను ఏర్పాటుచేసిరి. ఈ స్వతంత్రపక్షమువారిలో ముస్లింలీగుకు చెందినవారును కమ్యూనిస్టు అభిమానులును కూడా చేరియున్నారు.

పైరీతిగా పచ్చపెట్టెలను స్వల్పభేదాలతో భిన్నపక్షములకు ఏర్పాటు చేయుటయును, కాంగ్రెసుపార్టీతో సంబంధం లేని వారికి కాంగ్రెసు త్రివర్ణములుగల పెట్టెలను ఏర్పాటుచేయుటయును వోటర్లను కంగారుపరచుటకును భ్రమింపచేయుటకును వీలుగా నున్నది.

కమ్యూనిస్టుపార్టీవారు అధికారరీత్యా నియమించిన అభ్యర్థులకు ఎర్ర రంగు బాలెటు పెట్టెలను ఏర్పాటు చేసిరి.

బెజవాడలో కాంగ్రెసు పార్టీవారి అభ్యర్థులను ఓడించుటకు ప్రతికూలపక్షము నొకదానిని కట్టుదిట్టముచేసి మ్యునిసిపలు మార్కెటుకంట్రాక్టరైన డి యాళ్వర వెంకటేశ్వర్లు చాలా ప్రయత్నం చేయుచున్నారు. కాంగ్రెసుపక్షమువారమే అని చెప్పుకొనెడి మరి కొందరితో కలసి వీరుయీ ప్రబలప్రయత్నము చేయుచున్నారు. నాలుగు సంవత్సరములనుండియు తిరిగి మార్కెటు యిజారా కంట్రాక్టును వ్రాసికొనకుండానే మార్కెటుయొక్క కంట్రాక్టరుగా వీరు వ్యవహరించుచున్నారు. వీరిమీద కొన్ని సివిలుదావాలు దాఖలు చేయబడి విచారణలో నున్నవి. ఇంకారూ 2 లక్షల వరకు మరికొన్ని దావాలు దాఖలుచేయబడుటకు సిద్ధముగా ఉన్నవి. ఇట్టివారు కాంగ్రెసుకు ప్రతికూలంగా పనిచేసి మ్యునిసిపలు పక్షపక్ష స్థానములను తమవారికే లభింపజేసి ఆక్రమింపగోరుచున్నారు. బాలటుపెట్టెలను పైరీతిగా ఏర్పాటు చేయించవలసినదిగా కోదండరామరెడ్డిగారిని వారు కోరిరి. వారి కోరిక యీడేర్చబడెను. మరొక విధంగా కాంగ్రెసుపార్టీ వారిని యీ ఎన్నికలలో ఓడించుటకు వీలులేక పోవుటవల్ల యీ కుతంత్రములు చేయబడెను.

వోట్లు పెట్టెలను వేర్వేరు రంగులు వేయడం, వోటర్లు తికమకలు పడకుండుటకై ఉద్దేశింపబడెను. కాని, యిప్పుడీ రంగు భేదములు వోటర్లను తికమక పరచుటకు అక్కరకు వచ్చుచున్నవి.

ఈ కుతంత్రము యీ అక్రమము యీ రాష్ట్రమునకు మాత్రమే సంబంధించిన సమస్యకాదు కనుక, యీ అసందర్భపు ఏర్పాట్లను గూర్చి రాష్ట్రీయ ప్రభుత్వమునకు మాత్రమే గాక అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీకి కూడ తెలియజేయుడమైనది.

ఈ విషయములో మద్రాసు గవర్నమెంటు వారి జవాబుకు ఎదురుచూచుచున్నాము.

### బందరులో పోటీలేకుండా ఎన్నిక

బందరు, సెప్టెంబరు 2: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో యిప్పటివరకు 9 మంది కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికయారు. 16 వ వార్డు మహమ్మదీయస్థానమునకు జనాబ్ అబ్దుల్ సత్తార్ గారు పోటీలేకుండా ఎన్నికయారు.

### హొస్పేట

హొస్పేట, సెప్టెంబరు 4: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో యిప్పటివరకు 8 గురు పోటీలేకుండ ఎన్నికయారు. మిగతా 7 గురులోని స్థానములకు పోటీ ఉన్నది. ముగ్గురి నామినేషన్ పత్రాలు త్రోసివేయబడినవి. (స్వ. వి.)

### కాకినాడ

కాకినాడ, సెప్టెంబరు 3: స్థానిక మ్యునిసిపల్ ఎన్నికలోద్యోగి నిరాకరించిన అయిదు దరఖాస్తులలో మూడింటిని కలెక్టరుగారు అప్పీలులో అంగీకరించారు. మిగతా 20 స్థానములకు కాంగ్రెసు అభ్యర్థులు, కమ్యూనిస్టు అభ్యర్థులు, స్వతంత్రులు పోటీచేయుచున్నారు స్వ. వి

### రాజమండ్రి

రాజమండ్రి, సెప్టెంబరు 3: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికల సందర్భంలో 5 గురు కాంగ్రెసు అభ్యర్థులు పోటీ లేకుండ ఎన్నికయారు. ఒక స్వతంత్ర అభ్యర్థి కూడ పోటీ లేకుండ ఎన్నికయారు. మిగతా 27 స్థానములకు కాంగ్రెసు అభ్యర్థులు, కమ్యూనిస్టు అభ్యర్థులు, స్వతంత్రులు పోటీ చేయుచున్నారు. యీ నెల 29 న ఎన్నికలు జరుగును. (స్వ.వి)

### ఆదవాని

ఆదోని, సెప్టెంబరు 3 స్థానిక మునిసిపల్ ఎన్నికల సందర్భంలో 28 వార్డులలో 8 వార్డుల అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నికయారు. ఈయెన్నికలందు కాంగ్రెసు పాల్గొనలేదు . .

### నరసారావు పేట

నరసారావుపేట, సెప్టెంబరు 2: ఈ పట్టణ మునిసిపల్ ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థులు అనిసెట్టి కోట్లగం నాయుడు, పగిసం సెట్టి యాదాద్రి, రాజా కొత్తయ్య, జె. లాజరస్‌గార్లు పోటీలేకుండా ఎన్నిక అయారు.

## చెన్నరాష్ట్ర పండ్లు కూరగాయల వర్తకులు

### మహాసభలో తీర్మానములు

చెన్నపురి, సెప్టెంబరు 6: నేటి ఉదయం ప్రథమ రాష్ట్ర పండు కూరగాయల వర్తకుల, ఏజెంట్ల మహాసభ రెండవరోజు కార్యక్రమములో, పండ్లు కూరగాయలపై అమ్మకపు పన్నును తీసివేసి, ఇతర రాష్ట్రములలో అనుసరించుచున్న విధానమునే మద్రాసు ప్రభుత్వము అమలుపరచవలెనని తీర్మానించిరి.

రైల్వేవారు, యుద్ధకాలములో ప్రారంభించిన అధికచార్జీలను రద్దుచేయవలెనని కోరడమైనది. సంఘములశాఖల విస్తరణకై తీర్మానములు చేయబడినవి.

శ్రీ శ్రీరాములు నాయుడుగారు ప్రతినిధులను ఆహ్వానించిరి. 500 కు పైగా ప్రతినిధులు వచ్చిరి. ఇందులో సగము ఆంధ్రులు అందుచే ఈ రోజున ఉపన్యాసములు తెలుగులోనికి తర్జుమా చేయబడినవి. కొందరు తెలుగులోనే మాట్లాడిరి. బళ్లారి ఆంధ్ర వాణిజ్య సంఘము తరఫున శ్రీ టి. సత్యనారాయణగారు 'అమ్మకపు పన్ను రద్దు' విషయము గూర్చి, వర్తకుల కష్టములను గూర్చి మాట్లాడుచూ, ముఖ్యముగా ఈ వర్తకము ప్రజారోగ్యమునకు సంబంధించినది కనుక ప్రభుత్వము శ్రద్ధగా వీరి కష్టములను యోచించవలెనని.

సంఘపు ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రీరాములు నాయుడుగారు వందనము లర్పించిరి.

సాయంకాలము తిరువాంకూరు సోదరీమణుల నృత్య మేర్పాటు చేయబడెను.

### కార్వేటినగరం ఆలయప్రవేశం

కార్వేటినగరం, సెప్టెంబరు 3: కాన్పిలు అధ్యక్షులు గౌ॥ఆర్. బి రామకృష్ణ రాజుగారు నేడు 11-30 గంటలకు స్థానిక వేణుగోపాలస్వామి దేవాలయమునందు హరిజన ప్రవేశోత్సవం జరిపిరి. వారివెంట అనేక మంది హరిజనులు లోనికిపోగా అర్చకులు వారివద్దనుండి కుంకుమహారతి స్వీకరించిరి. తరువాత జరిగిన సభలో రామకృష్ణరాజుగారు హరిజనుల నుపన్యసించుచు, ఆలయప్రవేశోద్దేశం హరిజనులందరి పరిశుభ్రమయిన జీవితము గాంధీజీ గారి... ప్రభుత్వంవారు వారికి రక్షణ ఎన్ని సౌకర్యములు లొనగూర్చుచున్నారో వివరంగా తెలిపిరి.

### కొత్తపల్లి లక్ష్మయ్య గారి సన్మానం

ఆంధ్ర నాటక కళాపరిషత్తు స్థాపకులు, నాటక కళాసేవకులు అయిన శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్యగారికి వచ్చేజనవరిలో షష్టిపూర్తి సందర్భంలో సన్మానము జరుపుటకు నిశ్చయింపబడినదనీ, వారిజీవితచర్య పుస్తక రూపమున అచ్చువేయించి బహూకరించుటకు, వేయినూటపదార్లు సమర్పించుటకు ఉద్దేశింపబడినదనీ ఆంధ్రదేశంలోని కళాభిమానులందరూ సాదరసహకారము చేయవలెననియు పోలవమిల్లి వెన్నరాజు, ఆత్రేయ సూర్యనారాయణమూర్తి, చెరువువాడ వెంకటసుబ్బారావు, గొట్టిముక్కల రామచంద్రరాజు, నారిపూడి సత్యం, ఏడిద కామేశ్వరరావు, అడుసుమిల్లి సత్యనారాయణగార్లు విజ్ఞప్తి చేస్తున్నారు.

























Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras